Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యూం I.] మద్రాసు : 1941 వ సం॥ డిసెంబరు నెల 12 వ తేది శుక్రవారం [నెం 39 రు

## సమర సింహావలోకనం.

ఆఖరుకు అయిరోపా యుద్ధం అఖిలప్రపంచ యుద్ధం అయింది. మహాసంగ్రామం మన గ్రామానికే సమీపించింది. జపాను సేనలు బర్మా రోడ్డు వైపుకు దండెత్తిపోతూవున్నవని మొన్న జర్మను రేడియోలో జర్మనీవాడు అన్నాడు. కాని యీ వార్త నిజమని నిర్ధారణ కాలేదు. నిర్ధారణ అయినా, కాకపోయినా, బర్మాలోనుంచి చైనాలోకి పోయే రోడ్డును బంధించవలెననే సంకల్పం జపానువాళ్లకు కలిగింది. అందుకు ఒక పెద్ద కారణం వున్నది.

చైనామీద అక్రమంగా జపాను దండయాత్ర సాగించి చైనాను కొంచెంకొంచెంగా ఆక్రమించుకుంటున్నది. జపానుకు చైనా చేసిన అపకారం కించిత్తుకూడా లేదు. కేవలం రాజ్యకాంక్షతో జపాను చేస్తున్న పని యిది. ఇట్లా చైనామీద దండయాత్ర సాగించడం అక్రమమనిన్ని, చాలించవలెననిన్ని అమెరికా సంయుక్త రాష్ట్రాల ప్రభుత్వము అనేక విధాలుగా జపానుకు చెప్పుతూవచ్చినది. కాని, యీ రోజులలో జపానుకు గాని, జపాను మిత్రరాజ్యమైన జర్మనీకి గాని యే మంచిమాట చెప్పినా తప్పుగానే వున్నది. కాల మహాత్మ్యం అది. నారాయణా అంటే బూతుమాటగా వుంది. చెడిపోయే దినాలలో మంచిమాటలు చెవికెక్కుతాయా? అమెరికామాత్రం యీ అక్రమం సహించను అన్నది. చైనాకు కావలసిన ఆయుధ సామగ్రి యావత్తు అమెరికా సప్లయి చేస్తోంది. బర్మాగుండా చైనాకు ఒక రోడ్డు వున్నది. ఈ బర్మా రోడ్డు బ్రిటిష్‌వారిది. ఈ బర్మా రోడ్డుమీదుగా భద్రంగా అమెరికను ఆయుధ సామగ్రి చైనాకు పంపబడుతూవున్నది. బ్రిటిష్‌వారుకూడా చైనాకు మోటారు లారీలు వగైరా సామగ్రులు అనేకం సప్లయిచేసి, తమ బర్మాదేశంగుండా చైనాకు ఆయుధాలు సప్లయిచెయ్యడం విషయములో చాలా సహాయంచేస్తున్నారు. రంగూను రేవులో ఆ సామగ్రులను దింపి, బర్మా ఉత్తర సరిహద్దులవరకు రైలుమీద చేర్చి, ఆ సరిహద్దులవద్ద బ్రిటిష్‌వారు నిర్మించిన యీ బర్మా రోడ్డుమీదుగా సదరు ఆయుధసామగ్రులను చైనాకు చేర్చుతున్నారు. చైనాకు ఆయుధాలు సప్లయిచేయడంవల్ల చైనావారు బాగా సమర్థంగా యుద్ధంచేస్తున్నారు. అందువల్ల చైనాను శీఘ్రంగా జపానువారు జయించలేకుండావున్నారు. కనుక బర్మా రోడ్డును బంధించవలెననే సంకల్పం జపానుకు కలిగింది. బర్మా అంటే మన ఇండియా ప్రక్కనే వుంది. కలకత్తా రేవుకు సమీపంగావుంది రంగూను రేవు. బర్మా రోడ్డును బంధించడం కోసం జపానువారు బ్రిటిష్‌వారితో యుద్ధంచెయ్యడం తప్పదు. చైనాను రక్షించాలని అమెరికా చాలా పట్టుదలతో వుండడంచేత అమెరికాతోకూడ జపానుకు యుద్ధం తప్పదు.

### జపానులో సైనికాధికారవర్గ ప్రభుత్వం.

జపానుకు ఆ సంగతి తెలుసు—కాని రాజ్యకాంక్షతోను, యుద్ధ దాహంతోను, వీరావేశంతోను మదాంధులైన వాళ్లకు ఇది భూమి, ఇది ఆకాశం అనే విషయంకూడా తెలియదు. బ్రహ్మరుద్రాదులు దిగివచ్చినా యుద్ధం చేస్తానంటారు. బర్మా అంటేనే బ్రహ్మదేశం—ఆఖరుకు నిజంగానే బ్రహ్మదేశంమీదకుకూడా జపానువారు దండయాత్ర సాగించడానికి సర్వ సిద్ధంగా ఉన్నారు. జపాను ప్రభుత్వం ఇంత విపరీతంగా మిన్నుమన్ను కన్పించకుండా మిడిసిపడుటకు కూడా ఒక పెద్ద కారణం ఉన్నది. సాధక బాధకాలు, మంచి చెడ్డలు, ముందువెనుకలు, యుక్తాయుక్తములు తెలిసిన వివేకంగల వ్యవహార వేత్తలు జపానులో ఉన్నారు. కాని యిప్పుడు ఆ పెద్దలమాట చలామణీ కావడంలేదు. జపానులో సైనికాధికారుల పార్టీ అనేది చాలా ప్రబలంగా ఉంది. పెత్తనంఅంతా వారిదే. ఆ పార్టీవారే మంత్రులుగా ఏర్పడి తమకు తోచినట్లుగా వ్యవహారాలు నిర్ణయిస్తున్నారు. ప్రధాన మంత్రిపేరు టోజోగారు. విదేశాంగ వ్యవహార మంత్రి పేరు టోగోగారు—బాగో ఓగో టోగో చెప్పినట్లుగాను, టోజో చెప్పినట్లుగాను జపాను ప్రభుత్వచక్రం అంతా తిరగవలసినగతి పట్టింది. జపాను ప్రజలను నీటముంచినా పాలముంచినా వారిదే భారం. ఆఖరుకు జపానుదేశాన్ని వీరు నడిసముద్రంలోనే ముంచుతారేమో. అసలు జపానుదేశమే నడిసముద్రంలోవున్న పెద్దలంక. దేశమధ్యంలో అనేక అగ్ని పర్వతాలు. భూకంపాలు తరుచు వస్తూఉంటాయి. కనుక నడి సముద్రంలోఉన్న యీ లంక నాశనం కావలసిన కాలమేవచ్చింది. లేకపోతే ఈ లంకలో ఇంత చేటుపుట్టదు. జోగీ, జోగీ రాసుకుంటే బూడిదరాలుతుంది అంటారు—టోజో, టోగో యిద్దరూకలిసి వ్యవహరిస్తే జపానులోని నగరాలన్నీ భస్మం అవుతాయి. అమెరికాకు ఆయుధబలం, బ్రిటిష్‌వారికి అంగబలం, నౌకాబలం అపారపారావారంగా ఉన్నాయి. ఇటువంటి రెండు ప్రచండమైన రాజ్యాలతో నేడు జపాను యుద్ధం పెట్టుకుంది. ఇప్పటికి అయిదేండ్లనుంచి చైనాతో యుద్ధంచేసి చాలా నష్టపడివున్న స్థితిలో జపాను యిప్పుడు యింతటి పెద్దరాజ్యాలతో ఢీకొట్టుకుంటానంటున్నది. పొట్టేలు కొండతో "ఢీ" అన్నట్లుగా ఉంది.

### అమెరికావారి ఆఖరు సమాధాన ప్రయత్నాలు.

జపాను చక్రవర్తిఅయినా ఆఖరుకు మంచిచెడ్డలు గ్రహించి చెప్పినమాట వింటాడేమో అడిగిచూద్దామని, అమెరికా ప్రెసిడెంటయిన రూజువెల్టుగారు జపాను చక్రవర్తికి ఉత్తరం వ్రాసి పంపించాడు. కాని ప్రయోజనం లేకపోయింది. రూజువెల్టుగారు ఆ వుత్తరంలో ఒక ముఖ్యమైన విషయం అడిగినాడు.

బర్మాకు ప్రక్కను తూర్పుగా ఇప్పుడు తాయిలాండు అని పిలువబడే సయాం రాజ్యం ఉంది. దానికి ప్రక్కను తూర్పుగా ఫ్రెంచివారి ఇండో చైనా రాజ్యం ఉంది. ఫ్రాన్సు దేశాన్ని హిట్లరు జయించిన తర్వాత ఫ్రాన్సులో కొంత భాగాన్ని జర్మని ఆక్రమించింది. ఆక్రమించని భాగంలో విచీ అనే పట్టణంలో ఫ్రెంచివారు స్వతంత్రగా ఒక ప్రభుత్వపీఠం ఏర్పరచుకొని అనాక్రమిత ఫ్రాన్సును పాలించుకో

వచ్చునన్నాడు హిట్లరు. దీనినే ఫ్రాన్సులోని విచీ ప్రభుత్వం అంటారు. ఫ్రాన్సుకు చెందిన ఇండో చైనా రాజ్యాన్ని రక్షించడంకోసం జపాను సేనలను ఇండో చైనాలో ఉంచవచ్చునని విచీ ప్రభుత్వం అనుమతించి ఒక అనుమతి పత్రం వ్రాసియిచ్చింది. ఇదంతా హిట్లరు ఒత్తిడి చెయ్యడంవల్లనే విచీ ప్రభుత్వం చేసింది. ఈ అనుమతి పత్రంలో ఎంత జపాను సేనను ఇండో చైనాలో ఉంచవచ్చునని విచీ ప్రభుత్వం అనుమతించిందో అంతకుమించిన జపాను సేన ఇండో చైనాలో చేర్చబడింది. ప్రక్కనున్న థాయిలాండునుకూడా మింగివేయడానికి జపానువారు ఆలోచిస్తున్నారు. థాయిలాండును (సయామును) మింగిన తర్వాత అక్కడ పడమరగా ఉన్న బర్మామీదకు పోవచ్చు లేదా దక్షిణంగా ఉన్న సింగపూరుమీదకు పోవచ్చును. రెండూ బ్రిటిషువారివే. అనుమతి పత్రంలో అనుమతింపబడిన సేనకంటె ఎక్కువ సేనను ఎందుకు ఇండో చైనాలో చేర్చారు? అని రూజవెల్టుగారు జపాను చక్రవర్తిని అడిగినారు. ఇండో చైనాలో ఒక లక్ష 25 వేలు జపాను సైన్యాన్ని ఎందుకు చేర్చినారో సమాధానం చెప్పవలసినదన్నారు. అందుకు జపాను చక్రవర్తి చెప్పిన సమాధానం ఎంత సొంపుగా ఉన్నదో వినండి. ఫ్రెంచి ఇండో చైనామీదకు, ఉత్తరపు సరిహద్దులనుండి చైనావారి సేనలు దండెత్తివచ్చేటట్లుగా ఉన్నాయి గనుక చైనావారివల్ల ప్రమాదం లేకుండా ఇండో చైనాను రక్షించడానికి జపాను సేనను ఇండో చైనాలో చేర్చినాము అని జవాబు చెప్పారు. అదిన్నీ గాక అనుమతి పత్రంలో చెప్పబడిన సేనకంటె ఎక్కువ సేనను మేము చేర్చలేదు అని శుద్ధ అబద్ధంకూడా చెప్పారు. ఈ విషయమై ఇంకా కొన్ని సమాధాన పద్ధతుల గూర్చి అమెరికా విదేశాంగ వ్యవహార కార్యదర్శియైన కార్డెలుహల్లుగారు నవంబరు 26 తేదిని ఒక ఉత్తరం జపాను ప్రభుత్వానికి వ్రాసినారు. కాని పది రోజులు గడచినా ఆ ఉత్తరానికి జపాను ప్రభుత్వం జవాబు పంపలేదు. ఆ జవాబు ఇదిగో వస్తోంది అదిగో వస్తోంది అని ఆఖరుకు డిసెంబరు 7 తేది ఉదయం అందజేశారు. ఆ ఉత్తరం చూచుకొని కార్డెలుహల్లుగారు అన్నమాట ఏమిటో వినండి. "ఇంతకన్నా శుద్ధ పచ్చి అబద్ధాల పుట్టగా, ఏ ప్రభుత్వమున్నూ ప్రపంచంపుట్టిన తర్వాత, బాహాటంగా ఇటువంటి వ్యవహార పత్రం వ్రాయలేదు" అన్నారు.

## జపాను చెప్పిన అసందర్భ సమాధానం.

చైనామీదకు అక్రమంగా దండెత్తి వెళ్లినది జపాను. జపానులో అనేక అవస్థలపాలవుతున్నది చైనా. అటువంటి చైనా యిప్పుడు అనవసరంగా తిని కూర్చుండి ఇండో చైనామీదకు దండెత్తవలెనని ఆలోచిస్తున్నదట. అందుకని ఆ చైనా సేనలు ఇండో చైనాలోకి రాకుండా జపాను సేనలు లక్షలకొలదిగా అక్కడ ఉంచవలసివచ్చిందట. పూర్వం ఒక గయ్యాళి భార్య భర్తను కొట్టి, తానే భర్త దెబ్బలకు తాళలేకుండా ఉన్నదానివలె వీధిలో పడి ఏడవ సాగించిందట. ఆ విధంగా ఉంది జపానువారి జవాబు ధోరణి.

## జపాను ద్రవ్యం స్తంభింపజేయబడింది.

ఇటీవల కొంతకాలంనుంచి కూడా జపాను ధోరణి చూస్తూవుంటే బ్రిటిషువారికే అసహ్యం పుట్టింది. ఇటువంటి జపానుతో లావాదేవీలు చెయ్యడంకూడదని బ్రిటిషువారు నిశ్చయించారు. బ్రిటిషువారి రాజ్యంలో ఎక్కడ ఏ బ్యాంకులోనైనాసరే, జపానువాళ్ల తాలూకు పైకం వున్నట్లయితే ఆ పైకం వాళ్లకు యివ్వకుండా బిగబట్టి వుంచవలసినదని ఆర్డరు వేశారు. జపానువారి ద్రవ్యం బ్రిటిషువారి చేతులలో యీ విధంగా స్తంభించినతోడనే జపానువారుకూడా తమ చేతులలో చిక్కిన బ్రిటిషు ద్రవ్యాన్ని స్తంభింపజేశారు. ఆఖరుకు ఎవరిచేతులలో ఎంత చిక్కిందో లెక్కతేల్చి చూచుకున్నారు. జపానువారి చేతులో చిక్కిన ద్రవ్యానికి రెండు మూడు రెట్ల ద్రవ్యం బ్రిటిషువారి చేతిలో చిక్కింది. భద్రయ్యరెడ్డి పల్లకీ ఎక్కితే సాటిసరవయ్య చెరువుగట్టు ఎక్కినాడన్నట్లయింది. అటువంటి పరాభవంజరిగినప్పుడే రోషావేశాలు ఎక్కువవుతాయి. ప్రస్తుత జపాను మంత్రివర్గం పౌరుషమే ప్రధానం అంటుంది. క్రిందపడినా మీసం మన్ను కాగూడదనే తత్వంలోకిదిగింది. అందువల్ల అమెరికాతోను ఇంగ్లాండుతోను యుద్ధం ప్రకటించాలనే రోషం హెచ్చింది.

## యుద్ధప్రకటన చెయ్యకపూర్వమే జపాను యుద్ధం సాగించింది.

అమెరికా విదేశాంగ కార్యదర్శియైన కార్డెలు హల్లుగారు నవంబరు 26 వ తేదిని జపానుకు వ్రాసిన వుత్తరానికి జవాబు డిసెంబరు 7 వ తేది ఉదయం అందజేశారు. ఆ వుత్తరమును అమెరికాలో ఉన్న జపాను రాయబారి అమెరికా విదేశాంగ వ్యవహార కార్యదర్శిగారి కార్యాలయములో అందజేసిన సమయంలో అంతకుపూర్వమే ఒక గంటక్రింద జపానువారు యుద్ధం ప్రారంభించారు.

పసిఫిక్కు మహాసముద్రంలో అమెరికావారి తాలూకు హవాయి ద్వీపములలో, హొనలూలూ అనే గొప్ప రేవువుంది. అక్కడ అప్పుడే నౌకాయుద్ధం ప్రారంభించి జపానువారు ఫిరంగులు కాలుస్తున్నారు. అక్కడ యుద్ధం సాగిస్తూ యిక్కడ అమెరికాలో జపాను రాయబారులు ఇంకా వుత్తర ప్రత్యుత్తరాలు అందజేస్తున్నారు. ఒకవైపున కొంపకు నిప్పంటించి, ఇంటికి వచ్చిన బంధువుకు కంచంలో అన్నం వడ్డించినట్లుగా ప్రవర్తించారు. ఇదే జపానువారి విపరీతమైన యుద్ధ సామర్థ్యమట. ఇంత విపరీతబుద్ధి వినాశకాలానికేగాని ఇంకొకప్పుడు రాదు. అటు అమెరికా బ్రహ్మాండమైన బలంగల రాజ్యం. ఇటు ఇంగ్లాండు బ్రహ్మాండమైన బలంగల రాజ్యం. ఈ రెండింటి మధ్య ఈ చిన్న జపాను చేరి యుద్ధం సాగించింది. రెండు పెద్ద రాజ్యాలమధ్య యీ చిన్న జపాను రాజ్యం నిలువబడి పోరాడగలదా? హనుమంతుని ముందు కుప్పిగంతులు వేసినట్లుంది.

## ఆరంభ శూరత్వం.

ఆరంభశూరత్వం మాత్రం అట్టహాసంగా చూపిస్తోంది జపాను. అమెరికాకుచెందిన ఒక నావను ముంచింది. బ్రిటిషువారివి రెండు యుద్ధ నావలను ముంచింది. కాని జపానుకు చెందిన విమానాశ్రయనావను అమెరికావారు ముంచివేశారు. ఆ నావమీద విమానాలు దిగవచ్చు. విమానాలను తీసుకొనిపోయే పెద్దరకం యుద్ధనావ అది. చాలా ఎక్కువ విలువగలది. జపానువారివి అయిదు జలాంతర్గాములుకూడా ముంచివేయబడినవి. అమెరికాకుచెందిన ఫిలిప్పయిను లంకలు పసిఫిక్కు సముద్రంలో వున్నవి ఆ ఫిలిప్పయిను దీవులలోను హవాయిదీవులలోను జపాను సేనలను దింపవలెనని అట్టహాసంగా యుద్ధంచేస్తున్నాడు జపానువాడు. కాని ఆట సాగడంలేదు. బ్రిటిషువారు ఉక్కుముక్కలాగు బందోబస్తు చేసి ఉంచుకున్న సింగపూరు రేవును పటాపంచలు చెయ్యాలని బాంబులు వేస్తున్నాడు.

అమెరికాఖండపు పడమటి కోస్తామీదకు మొన్న 30 జపానువిమానాలను పంపించాడు. ఇంకా పోరాటం ఆరంభదశలోనే ఉంది. ఎవరి కెంత సత్తావున్నదో ఆశ్వాసాంతం

చూస్తేగదా నిర్ణయమయ్యేది. ప్రారంభంలోవున్న ప్రతాపం చివరివరకూ ఉండదు. రామరావణ యుద్ధంలో రాముల వారికే మొదట అపజయం కలిగేటట్లుగా కన్పించింది — లక్ష్మణ స్వామి మూర్ఛపోయినాడు. కాని, ఆఖరుకు ఒక్కటే రామబాణం తిరుగులేకుండా రావణాసురుని సంహరించింది.

## రష్యా రంగం.

ఇక్కడ శాంతమహా సముద్రం అశాంతి మహాసముద్రంగా మారింది. అక్కడ రష్యాలో యుద్ధం నిర్వికల్ప సమాధిగా వుంది. రష్యా ముఖ్యపట్టణమైన మాస్కో నగరాన్ని ముట్టడించడంకోసం జర్మను సేనలు నెలరోజులనుంచి ప్రయత్నిస్తున్నాయి. మాస్కోకు దక్షిణంగా సమీపంలోవున్న తులా నగరాన్ని జర్మనులు పట్టుకోనలేకుండా తులాలో ప్రవేశించలేకుండా వున్నారు. అప్పుడే ధనుర్మాసం వస్తోంది అఖండమైన చలిలో యుద్ధం చెయ్యలేరు. ఈ ధనుర్మాసం చలిలో ధనుర్బాణాలు క్రిందపెట్టాలి ఎంత యోధుడైనా — సూర్యుడు ధనస్సులో ప్రవేశించబోతున్నప్పటికీ జర్మను లింకా తులలోనైన ప్రవేశించలేదు.

రష్యాలోని దక్షిణరంగంలో ఇదివరకు జర్మనులు చాలా ముందుకు పోయినారు. రాస్టావు వరకు వెళ్లినారు. అటువంటి జర్మనులు ఇప్పుడు అంతకంతకు తోకముడతపెట్టి వెనుకకు వెడుతున్నారు. రాస్టావునుంచి టాగనరోగుకున్నూ, అక్కడినుంచి మారిపూలుకున్నూ జర్మనులు వెనుకకు నడుస్తున్నారు. బ్రతికి బాగుంటే బలుసాకు తినవచ్చునని పలాయనమవుతున్నారు. అక్కడ జర్మను గడియారం వెనుకకు తిరుగుతోంది.

## ఉత్తరాఫ్రికాలో యుద్ధం.

అక్కడ రష్యాలో అట్లా ఉండగా, ఉత్తరాఫ్రికాలో అనగా లిబియాలో జర్మనులు నాలుగుచోట్ల చతుష్కోణంగా యుద్ధం చేస్తున్నారు. ఈ చక్రాకంలోనే చచ్చిపోతున్నారు చాలామంది జర్మనులు — లేదా వారికి దావుతప్పి కన్ను లొట్ట అవుతోంది. మొన్న జర్మనుల తాలూకు పెట్రోలు వాగను గల పెద్ద రైలుబండి తగలబడిపోయింది. ఆ బండ్లను బ్రిటిషు విమానాలే బాంబులువేసి భస్మం చేశాయి. రష్యాలో నష్టమవుతున్న జర్మను సేన ఇంతా అంతా కాదు. లక్షోపలక్షలుగా నష్టమవుతోంది. ఇంకా సాగించవలసిన యుద్ధం అనంతంగా ఉంది. జర్మనీవాళ్ల జాతకంచూస్తే ఉత్తరోత్తర చాలా నష్టజాతకంగానే కన్పిస్తోంది. జర్మనీకి సైన్యం శూన్యం అనే రోజులుకూడా త్వరలోనే వస్తున్నాయి.

---

# తాయిలాండు.

## పశిఫికు సముద్రప్రాంతములందు దాని ప్రాముఖ్యత: జాపానుతోగల సంబంధము.

[ఏషియా ఆగ్నేయదిక్కుననున్న చిన్న రాజ్యమగు తాయిలాండునకు పూర్వం సయాం అని పేరుండేది సుమారు 200,000 చదరపు మైళ్ల విస్తీర్ణం; 15,000,000 జనసంఖ్య, బాంగుకాకు అన్నది ముఖ్యపట్నం. ఆనంద మొహిదల్ రాజు ప్రస్తుతం పాలించుచున్నాడు. అతని వయస్సు 16 సంవత్సరములు. తాయిలాండునకు తూర్పు-ఉత్తరములందు ఇండో-చీనా, పడమరను బర్మా, దక్షిణమున మలయా దేశము సముద్రము గలవు రాజుగారికి పరిమితాధికారముల నొసంగి ప్రజాప్రతినిధుల పక్షమే దేశమును పరిపాలించుచున్నది. ఈ దేశం యొక్క వ్యాపారం బ్రిటిషు, మలయ, హాంగుకాంగు, ఇంగ్లాండు-జపానులతో ఎక్కువగలదు. డచ్చి తూర్పు దీవులపై దాడిచేయదలచినవారికి తాయి సముద్రతీరము అనువగు నివాసస్థానముగ నుండగలదు. అందుకే ప్రక్కనున్న ఇండో-చీనాను ఆక్రమించిన జపాను యీ తాయిలాండుగుండా తమ సైన్యములను పోనిచ్చుటకు తాయి ప్రభుత్వమును ఒప్పించెను.]

1939 వ సం॥ జూన్ 24 వ తేదిన మంత్రివర్గం తీర్మానం ప్రకారం సయాందేశం పేరు తాయిలాండు అని మార్చబడింది. తాయిలాండు అంటే సయాంభాషలో మాంగుతాయి. అంటే "స్వతంత్రప్రజల రాజ్యం" అని అర్థం. ఈ దేశంయొక్క స్వాతంత్ర్యం కాపాడుతామని ఇంగ్లాండు, ఫ్రాంసు ప్రభుత్వములు 1904 వ సం॥ ఏప్రిలులో అభయ మొసంగినవి. ప్రజలు యెక్కువభాగం వ్యవసాయదారులే. నేలయు, శీతోష్ణస్థితియు వ్యవసాయమునకే అనుకూలం. కాని వేడి యెక్కువగుటచే ప్రజలు సోమరులుగ నుందురు.

మొట్టమొదట 1518 వ సం॥లో యూరోపులోనున్న పోర్చుగీసు ప్రజలు తాయిలాండుతో వ్యాపారం ప్రారంభించిరి. డచ్చివారు 1598 వ సం॥లోను, బ్రిటిషువారు 1612 వ సం॥లోను వచ్చిరి. 1664 వ సం॥లో డచ్చి తూర్పు ఇండియా కంపెనీతో సయాంప్రభుత్వం ఒడంబడిక గావించుకొనెను. కాని డచ్చి ప్రజల అమాయకత్వంచేత 1706 వ సం॥లో యీ దేశంతో వర్తకం వదలుకొనిరి. 1620 వ సం॥లో జపానీయులు వర్తకంచేయ వచ్చిరి. 1662 వ సం॥లో ఫ్రెంచివారు వచ్చుసరికి సయాం మంచి వర్తకప్రాముఖ్యత గాంచెను. చీనా-జపాను, సుమత్ర ఇండియాల వ్యాపారములకు మధ్యగనుండి సరకు ఫల్లాచేసుకొను గిడ్డంగివలె వుండెను.

ఆ రోజులలో ఫరానారాయి అను రాజు సయామును పాలించుచుండెను. కాన్‌స్టెన్టైను, ఫాల్కను అను గ్రీకు దేశీయుడు అతనికి విదేశీయులతో వ్యవహారములందు తోడ్పడుచుండెను. అయోధ్యా యను పురము ముఖ్యపట్నంగా నుండెను. ఫ్రెంచివారు మొదట ఫాల్కను ప్రోత్సాహంతో మతప్రచారమునకై వచ్చిరి. తరువాత రాజుగారికి డచ్చి రి బ్రిటిషువారి ముప్పులేకుండా రక్షించే నెపమున కొన్ని సేనలనుగూడ తెచ్చిదించిరి. చివరకు రాజునే క్రైస్తవమతంలోకి మార్చాలని ప్రయత్నంచేయుసరికి ప్రజలు తిరుగబడి, ఫాల్కన్ను, రాజవంశంలో ముగ్గురు వారసులను చంపివేసిరి. రాజు జబ్బుగనున్నందున చంపకుండ విడచిరి.

1759-1767 సంవత్సరాలలో బర్మాతో యుద్ధం జరిగినపుడు అయోధ్య కాల్చివేయబడెను. యుద్ధానంతరం అరాచకంగానున్న ఐదు సంవత్సరాలలో ఒక చీనా సేనానాయకుడు మొనగాడై సయాం స్వాతంత్ర్యమును పునరుద్ధరింపజేసెను. బాంగుకాకును ముఖ్యపట్నంచేసెను చాక్రివంశం రాజులు 1782 వ సం॥ నుండి 1932 వ సం॥ వరకు పాలించిరి. వారిలో ముఖ్యుడు చులలాంగుకారను అను రాజు దేశ పరిపాలనయందు చాల అభివృద్ధికరమగు మార్పులు కలిగించెను.

ఈతడు ఇంగ్లీషు నేర్చెను. న్యాయస్థానములు, పోస్టు పద్ధతి స్థాపించి, రైల్వేల నిర్మాణం ప్రారంభించెను. అయినా యీతనికి ఫ్రెంచివారితో పోరాటం తప్పలేదు. ఇండో-చీనాను ఆక్రమించిన ఫ్రెంచివారు బాంగ్ కాకునకు దిగ్బంధం చేసి, తమ సేనలను సయాంలో దింపి, ఎక్కువ రాజ్యంలో సగం రాజ్యం తీసుకొనిరి. 1905 వ సంవత్సరంలో రాజీ కుదిరి ఫ్రెంచు-ఇంగ్లాండులు రెండును సయాం స్వాతంత్ర్యం కాపాడ పూచీపడినవి. చులాలాంగుకారను రాజు చాల దేశాలు స్వయంగా తిరిగివచ్చి, పాశ్చాత్యావిద్య నాగరికతల యందభిమానం కలవాడగుటచే, రాజవంశీయులకు గౌరవ కుటుంబాల వారందరికి ఆ విద్య నేర్పించి ఉద్యోగాలిచ్చుచుండెను. అవి సామాన్య ప్రజకు కంటకంగానుండెను. ఇతని తరువాత యితని కుమారుడు వాజీరవూచి రాజు, సయాంలో బాలభటోధ్యమం స్థాపించి, విద్యావిధానం మార్చి చాల మార్పులు చేసెను. తరువాత 1925 వ సం॥ నుండి 1935 వ సం॥ వరకు యితని తమ్ముడు ప్రజాధిపోక్ అను రాజు పాలించెను.

## రాజకీయపు ఒడుదుడుకులు.

ప్రజాధిపోక్ రాజు రాజ్యానికి రాగానే తనకు పరిపాలన యందు తోడ్పడుటకు ఉన్నత స్టేటు కౌన్సిలును, ప్రీవీ కౌన్సిలును స్థాపించెను. విమాన వాయువార్తా సర్వీసులను యేర్పాటుచేసెను. అనవసరంగాను వక పెక్కుండ్రు ప్రభుత్వోద్యోగులను తొలగించి ఆదాయ వ్యయములు సరిపెట్టెను. కాని పనులు పోయినవారు దేశంలో అసంతృప్తి చెందిన ప్రతికూలముఠా సంఖ్యను పెంచిరి.

1932 వ సంవత్సరము జూన్‌లో విప్లవం జరిగింది. రాజుగారు హ్యూహినుపురమునందు వేసంగికోటలో ఉండగ, 40 మంది మంత్రులు ఉద్యోగులను నిర్బంధించి సైనికాధికారులు కేంద్రపట్నమును సింహాసనమును వశపరచుకొనిరి. రాజ్యపరిపాలనాధికారం ప్రజాపక్షం తీసుకుంది. రాజవంశంవారు నిర్బంధింపబడిరి, రాజుగారు ముఖ్యపట్నమునకు వచ్చి పరిమితాధికారములతో పరిపాలించుట కంగీకరించితే వారు విడుపబడుదురు, అని ముగ్గురు సేనానాయకులు సంతకం చేసి రాజుగారికి అంత్యసందేశం పంపిరి. రక్తపాతం తప్పించుటకై ప్రజాధిపోక్ రాజు "నూతన ప్రభుత్వ విధానం స్థాపించుటకు తోడ్పడెదను" అని అంగీకరించెను. పైగా తాను రాజుగా నుండకపోతే విదేశ ప్రభుత్వాలు సయాం నూతన ప్రభుత్వాన్ని గుర్తించవనికూడ ఆతడు కారణం తెలిపెను. ఈ తిరుగుబాటునకు కారకులు సైనికోద్యోగులే కాక, పలువురు సివిలు ఉద్యోగులు ప్రజా నాయకులు గూడగలరు. దేశంలో ఆర్థిక దుస్థితి ప్రబలుచుండగా, స్టేటు రైల్వేకు 13 డైసెలు ఇంజనులు ఎందుకు కొనాలని, 12 గురు మంత్రులలో 8 గురిని రాజవంశం వారినే నియమించిరనియు, ఆర్థిక వ్యవహారాలన్ని రహస్యంగా చేస్తున్నారని, పత్రికలు రేడియోలపై ప్రభుత్వాధికారుల అధికారం ఎక్కువైయుందని, జీతాల పన్ను విధించారని, రాజుకి నిరంకుశ పరిపాలనాధికారం ఉండరాదనే భావం పెరిగిందని;—యివన్ని విప్లవానికి కారణాలుగా చెప్పబడినవి.

కాని క్రొత్తగ అధికారానికి వచ్చినవారికి అనుభవం తక్కువై ప్రాత ఉద్యోగులపైనే ఆధారపడిరి. క్రొత్త రాజ్యాంగ విధానం 1932 వ సం॥ జూన్‌లో రాజుగారిచే అంగీకరించబడెను. ప్రజాపక్షనాయకులు రాజుగారికి అపచారం చేసినందుకు పబ్లికుగ క్షమాపణకోరిరి. అప్పటినుండి 1933 వ సం॥ డిసెంబరులోగా క్రొత్త మంత్రివర్గమునకు చాల చిక్కులేర్పడెను. కాని చివరకు ఫయాబహోలుగారు ప్రధాన మంత్రిగ ఎన్నుకొనబడి నాలుగేండ్లు ఆ పదవిలో నుండిరి.

## రాజు వెడలిపోవుట.

శాసన సభలు అంగీకరింపకున్నా 1934 వ సం॥ జనవరిలో ప్రజాధిపోక్ రాజు కన్ను ఆపరేషను చేయించుకొనుటకై అమెరికాకు పయనమయ్యెను. సుమత్రాలో ప్రవాసమున్న తన రాజవంశీయులందరిని చూచి. రాజు విదేశాలకు పోయెను. ఆతను లేనపుడు శాసనసభలలో ఆతని కిష్టములేని మూడు శాసనములు గావించబడెను. అందుచే అతడు రాజ్యపరిత్యాగం చేయునను వదంతులు వ్యాపించినవి. ప్రజాపక్షంవారు ముగ్గురు నాయకులను ఇంగ్లాండు పంపి, రాజుగారిని తిరిగిరమ్మని వేడుకొనిరి. ఆతడు రాజ్యపరిత్యాగం చేస్తూ, ప్రజాపక్షంలోనున్న కొద్దిమంది అధికారమంతా తీసుకొని ప్రజాభిప్రాయాన్ని నిర్లక్ష్యం చేస్తున్నారని, రాజకీయ ప్రత్యర్థులను హింసిస్తున్నారని నిందించుచు లేఖ వ్రాసెను. శాసన సభలో రాజుగారి పరిత్యాగమునకు విచారం ప్రకటించి, ఆతని కుమారుడగు ఆనంద మొహిదళ గారిని రాజుగా పిలువ తీర్మానించబడెను. ఈతడు 10 సంవత్సరములవాడు; అపుడు స్విజరులండులో చదువుకొనుచుండెను. ఈతని తరఫున ఆదిత్యాబ్ ఆభారా కుమారుడు మరి యిరువురు రీజెంట్లుగ పరిపాలించుచుండిరి. బాలరాజు 1938 వ సం॥ నవంబరులో వచ్చి పట్టాభిషేకం చేసుకొనెను. తిరిగి త్వరలోనే విదేశాలకు పోయెను. ప్రజలాతనియం దమిత భక్తి ప్రకటించిరి. అతని తండ్రి ఇంగ్లాండులో 1941 వ సం॥ మే మాసంలో చనిపోయెను. 16 సంవత్సరముల బాలరాజు యిప్పటికిని స్విజరులాండులోనే యున్నాడు. స్టేటు కౌన్సిలు, పీపిల్సు అసెంబ్లి న్యాయస్థానములు దేశపరిపాలన జరుపుచున్నవి. కాని ముఖ్యాధికారులు సైనికాధికారులే.

## విదేశాలతో సంబంధం.

సయాంలో విప్లవం జరుగుచున్నంత కాలమును, విదేశీయ రాజ్యాలేవి జోక్యం కలిగించుకోకుండ సయాం ప్రజలు శ్రద్ధ వహించిరి. 1937 వ సం॥ చివరను బ్రిటను, ఫ్రాంసు, జర్మనీ, ఇటలీ, అమెరికా ప్రభుత్వాలన్నిగూడ సయాం తమతో సరిసమాన హక్కులుగల స్వతంత్ర రాజ్యంగా గుర్తించుచు ఒడంబడికలు సంతకం చేసినవి. సయాంతో జపాను 1887 వ సంవత్సరమునుండి సఖ్యత ఒడంబడిక చేసుకున్నది. 1898 వ సంవత్సరములో వాణిజ్యపు ఒడంబడిక గావించుకొన్నది. సయాంలో జపానుకు ప్రత్యేక ప్రాంతాధికారం వదలుకొనుచు 1924 వ సంవత్సములో ఒడంబడిక సవరించబడెను. 1937 వ సంవత్సరం ఒడంబడిక ప్రకారం సయాం దేశీయులతో సరిసమానమగు హక్కులతోనే జపానువారు సయాంలో ప్రవేశించుటకు అవకాశమేర్పడెను. 1940 వ సం॥లో రెండు దేశాలు ఒకరి స్వాతంత్ర్యము యింకొకరు మన్నించుటకును, సమిష్టి వ్యవహారాలందు సంప్రదించుకొనుటకును, మూడో రాజ్యమేదయినా ఒకరిపైదాడి వస్తే రెండవ ప్రభుత్వం దానికి తోడ్పడరాదనియు థాయి-జపాను ఒడంబడిక జరిగెను.

# జర్మను ఖైదీలు.



బ్రిటీషు సేనలు టోబ్రూకును పకడ్బందీగ రక్షించుచున్నవి. అనేక పర్యాయములు జయప్రదముగా దెబ్బ తీశాయి కూడా. ఈ పటములో యుద్ధములో పట్టుబడ్డ జర్మనులను చూడవచ్చును.

---

1939 వ సం॥ జూలై మాసంలో నిరాక్రమణ ఒడంబడిక సయాం-ఇంగ్లాండులకు జరిగెను. కాని ఫ్రాంసుతో అట్టి ఒడంబడిక స్థిరం కాలేదు. సయాం దేశాన్ని ఫ్రెంచివారు తీసుకొని ఇండో-చీనాలో కలుపుకున్నందున సయాం ప్రజలకు ఫ్రెంచివారంటే ఎన్నడు సరిపడదు. అందుచే నేటియుద్ధంలో 1940 వ సం॥లో ఫ్రాంసు జర్మనీకి లొంగిపోయినపుడు సయాం తన రాజ్యభాగాన్ని తిరిగి సంపాదించుకోగలనని ఆశ చెందెను. ఇండో-చీనాతో సయాం, జపాను ప్రోత్సాహంతో తగవుపెట్టుకొనెను. 1941 వ సం॥లో జపాను మధ్యవర్తిగా వచ్చి 25,000 చదరపుమైళ్లు ఇండో-చీనాలో భాగం థాయిలాండుకి యిచ్చివేయాలని నిర్ణయించెను.

1941 వ సం॥ జూలైలో విషీ ప్రభుత్వంపై ఒత్తిడి కలిగించి, ఇండో-చీనాలోని సైనిక నౌకాదళ విమాన కేంద్రముల కనువగు స్థలములను జపాను వశపరచుకొనెను. థాయిలాండునుగూడ అట్లె ఒత్తిడిచేయ అపుడే ప్రయత్నించెను. బ్రిటను, చీనా ప్రభుత్వాలు థాయిలాండుపై దాడి రాకుండా తాము రక్షిస్తామని నెపం చెప్పెను. జర్మనీ, ఇటలీలుగూడ బలహీనమగు రాజ్యాలను ఆక్రమించే ముందు యిట్టి సాకులే చెప్పెవి. జపానుకి విఘ్నం చేయటానికి ఇంగ్లాండు సయామును నాక్రమించునని యిపుడు సాకు చెప్పుచున్నది. థాయి ముందుగా జపాను షరతుల నంగీకరించలేదు. సయాముబ్యాంకులో 10,000,000 బహట్లు (సయాము నాణెము) ఋణమిస్తామని, మంచుకోపై జపాను అధికారాన్ని అంగీకరిస్తామని థాయిప్రభుత్వం చెప్పెను. అయినా యీవారంలో జపాను, బ్రిటిషు అమెరికాలపై యుద్ధం ప్రకటించినాక, గత్యంతరం లేక థాయిప్రభుత్వం జపాను సేనలు తమ దేశంగుండా పోవుటకు అనుమతించెను. సయాంస్వాతంత్ర్యాన్ని కాపాడుతామని బ్రిటిషు ప్రధాని అభయమొసంగెను.

థాయిలాండులో యిటీవల రబ్బరు ఉత్పత్తి యెక్కువయింది. 53,584 టన్నుల రబ్బరు 4,423,700 టన్నుల ధాన్యం, 16,700 టన్నుల తగరపు రేకు సాలీనా తయారగుచున్నది. బ్రిటను, డచి దీవులతోనే ఎక్కువ వ్యాపారం జరుగుచున్నది. జపానునుండి థాయిలోనికి దిగుమతులెక్కువ, ఎగుమతులు తక్కువ.

## చీనావారు.

థాయిలాండులో 3,000,000 చీనావారున్నారు. ఇచట నున్న విదేశీయులందరిలోకి చీనావారి సంఖ్యయే యెక్కువ. కాని చీనా రాజకీయ ప్రతినిధి కార్యాలయం ఏదీ థాయిలాండులో లేదు. అంతేకన్న చీనాతో ఒడంబడిక యేదియు లేదు. సయాం దేశీయులు చీనావారంటే అసహ్యించుకుంటారు. వారిని తూర్పుదేశపు యూదులందురు. వారి దిగుమతిని తగ్గించుటకు పన్నులు విధించబడుచున్నవి.

# పసిఫికు మహాసముద్రమునందు యుద్ధం
# జపాను ద్రోహం.

జపాను యుద్ధంలో దిగింది. ఈ యుద్ధంలో తాను జర్మనీ-ఇటలీలను అనుసరించుటకు నిశ్చయించింది. ఇపుడిది నిజంగా యావత్ప్రపంచ మహాయుద్ధం అనిపించుకుంటుంది. అక్షరాజ్యాల ప్రపంచాధిపత్యం నిరోధించడానికి ప్రతిదేశం యిపుడు కంకణం కట్టుకుంది. చర్చిల్‌గారు చెప్పినట్లు జపాను బుద్ధిపూర్వకంగా కుట్రలుపన్ని ద్రోహం చేయుటచే యీ స్థితి సంభవించెను. ఓమూల వాషింగుటనులో తమ ప్రతినిధులు ఒడంబడిక కుదుర్చుటకై రాయబారాలు కొనసాగిస్తూ ఉండగానే జపాను ఉన్నతాధికారులు తమ బాంబరు విమానాలు పంపి బ్రిటిషు-అమెరికనుల సైనిక శిబిరాలపై దాడిచేయమని వుత్తరువు చేసిరి.

పసిఫికు సముద్రప్రాంతాలందు ఉన్నతాధికారం వహించాలని జపాను ఎంతకాలంనుండో ఆశించుచున్నదని యిపుడు స్పష్టమయినది. అందుకనే అమెరికా మంత్రి కార్డెలుహలు గారు పంపిన నిరాక్రమణ ఒడంబడికయందు సంతకం చేయలేదు. తాయిలాండు సరిహద్దులవద్దకు జపాను సైన్యాలను ఎక్కువగ పంపి, ఎందుకు పంపేవంటే అపకీర్తిభాజనమగు మోసపు సమాధానములు చెప్పెనని అధ్యక్షుడు రూజువెల్టుగారనిరి. అక్షరాజ్యాలు కూడ యిట్టి సమాధానాలే చెప్పుచుండేవి, కనుక యిందేమి ఆశ్చర్యంలేదు. ఇటువంటి మోసం యికముందు తమకు ఎట్టి ప్రమాదం కలిగించదు. అమెరికాకు ధర్మబలం కలదు. కనుక తప్పక విజయం పొందును అని అధ్యక్షుడు రూజువెల్టుగారు తమశాసనసభలో నుడివిరి. జపాను ప్రాంతాలలో శాంతి భంగం కలుగకుండుటకు ఆతడెంతయో ప్రయత్నంచేసి, చిట్టచివరకు జపాను చక్రవర్తికిగూడ ఒక విన్నపం పంపి, సేనానాయకుల ఉద్రేకమునకు లొంగి పోరాదని హెచ్చరించియుండెను. ఇంతచేసి విఫలుడైన పిదప ఆతడింత కోపగించుకొనుటకు కారణంలేకపోలేదు.

### జపాను దుండగమునకు కారణం.

జపాను ఎందుకిలాగ గౌరవమర్యాద లన్నింటిని వదలుకొని యీ అగడముచేసినది? చర్చిలుగారందుకు సమాధానం సరిగ చెప్పిరి. హిట్లరు పిచ్చె జపానీయులకు గూడ కలిగినది. బ్రిటనుపై దాడిచేయలేక పోయినందున, ఆఫ్రికా ప్రాంతములందు బ్రిటిషువారి శక్తి యిపుడు అధికమయినందున, రష్యాలో తన సైన్యాలు అంతకంతకు వెనుకబడుచుండుటచేతను, జపాను పసిఫికు ప్రాంతాలలో యుద్ధానికి గడంగి యూరోపులోని బ్రిటిషు సైన్యాలను అటుమరల్చాలని హిట్లరు జపాన్ను ప్రోత్సాహించెను. జపాను అందుకెంతయో సిద్ధముగనున్నది. అదివరకే దురాక్రమణ చర్యలకు గడంగినందున ఎ.బి.సి.డి. రాజ్యాలు ఆర్థిక బహిష్కారము సాగించినవి. తూర్పు ఏషియాయంతను ఆక్రమించి "సమిష్టి సంపదాభివృద్ధి రంగం" ఏర్పరచే ఆశ జపాను నాయకులకు పోలేదు.

ప్రారంభంలో జపాను కొంచెం విజయం పొందిందనడానికి ఎట్టి సందేహం లేదు. అకస్మాతుగ దెబ్బకొట్టి లూటీ చేయుచున్నప్పుడు మనకు కొంతనష్టం కలుగుట సహజం. చర్చిల్ ప్రధాని చెప్పినట్లు క్రొత్త ప్రమాదాలను చులకనగ చూడరాదు. శత్రువు అకస్మాత్తుగ ఆశ్చర్యకరమగు చొరవ చూపడం, నిర్లక్ష్యంచేతనైనా కావచ్చును లేదా తన శక్తియందు పూర్ణవిశ్వాసముతోనైన కావచ్చును. జపాను అల్ప శత్రువు కాదు. మూర్ఖ పట్టుదల గలదు. దాని నౌకాదళం సరి క్రొత్తసాధనసంపదకలిగి శక్తివంతమయినది. సప్లైలు గూడ దిట్టంగా వుంటుంది. ఎ. బి. సి. డి. (అమెరికా, బ్రిటను, చీనా, డచ్చి) రాజ్యాల సమిష్టి సైన్యాలు రష్యా సహాయంతో కూడ జపాను దురాశను అణచివేయగలవు. ఆయితే విజయం త్వరలో చేకూర నేరదు.

### యుద్ధక్రమం.

జపాను దురాక్రమణకు గడంగి మరునాడు జరిగిన యీ దిగువ విషయాలను బట్టి యీ రాజ్యాలన్నీ జపాన్ని ఎదిరించడానికి స్థిర సంకల్పం కలిగియున్నాయని రుజువు కాగలదు.

(1) అదివరకున్న హేగు ఒడంబడికకు విరుద్ధంగా జపాను కారణములేకుండా మలయా, సింగపూరు, హాంగుకాంగు రేవులపై దాడిచేయుటచేత, యుద్ధం ప్రారంభమయినట్లెంచుచున్నామని బ్రిటిషు ప్రభుత్వం జపాను ప్రభుత్వానికి తెలియచేసినట్లు పార్లమెంటు సభలో చర్చిల్ ప్రకటించెను.

(2) జపాను నిర్నిమిత్తంగా దారుణంగా హావాయి దీవులపైన యితర అమెరికా రాజ్య భాగాలపైన దాడిచేసినందుకు జపానుపై యుద్ధం ప్రకటించాలను అధ్యక్షుని సూచనను అమెరికా కాంగ్రెసు అంగీకరించెను. సెనేటు సభలో ఒక్కని ప్రతికూలతతో 388 అనుకూలురతో యుద్ధం తీర్మానించబడెను. కూడదన్నవారు లేరు. అమెరికా సంయుక్తరాష్ట్రములు పూర్తిగ యుద్ధంలో దిగిపోయినవి.

(3) కెనడా, ఆస్ట్రేలియా, న్యూజిలాండు, ఇండియా మున్నగు బ్రిటిషు సామ్రాజ్యదేశాలు బ్రిటను-అమెరికాలననుసరించి యుద్ధం ప్రకటించి, తమ దేశాలలోనున్న జపానీయులను అరెస్టుచేసి ఆస్తులను జప్తు చేసినవి.

(4) తనకు మిత్రులుగానున్న రెండు రాజ్యాలపై జపాను సేనలు దండెత్తి వెళ్లినందున జపానుతో తాను యుద్ధం చేయక తప్పదని రాయల్ నెదరులండ్సు (డచ్చి) ప్రభుత్వం తెలియజేసెను.

(5) అమెరికాలోనున్న యితర లాటిను రాష్ట్రములు గూడ జపానుకి ప్రతికూలంగా ప్రజాప్రభుత్వాల పక్షమున చేరినవి. కోస్టారికా, సాల్వడారు ప్రభుత్వాలు జపానుపై యుద్ధం ప్రకటించినవి. క్యూబా మంత్రివర్గము, మెక్సికో

అధ్యక్షుడు కూడ అట్లే ప్రకటించిరి. ప్రెసిడెంటు అధ్యక్షుడు అమెరికా సంయుక్తరాష్ట్రములతోనే యుంటామనెను; ఉరుగ్వే మంత్రివర్గం సమావేశపరుచబడెను. అర్జెంటినా మాత్రం తటస్థంగావుండ నభిలషించెను.

ఈ వ్యవహారం అంతాచూస్తే చిట్టచివరకు జపానుకు ప్రతికూల శక్తులధికంగా వున్నాయని తెలియగలదు. ప్రారంభంలో ఎదుటివారు సిద్ధంకాకముందు కొద్దిగా జపాను విజయం పొందినా చివరకు ఓడిపో తప్పదు.

ఇప్పటివరకు జపాను విమిచేసిందంటే యుద్ధనావలపై నుండు విమానాలు కొన్నింటిని పంపి పసిఫిక్ సముద్రమునం దున్న అమెరికా శిబిరాలగు పెర్లు హార్బరు, గ్వాము, ఫిలిప్పైను దీవులపై దాడి సలిపెను. హవాయి దీవులలో శత్రు దాడివలన అమెరికా సైన్యానికి నౌకాదళానికి చాల నష్టం కలిగి, చాలమంది చనిపోయిరని అధ్యక్షుడు రూజువెల్టు ప్రకటించెను. ఒక ప్రాత యుద్ధనౌక, ఒక డిస్ట్రాయరు నౌక, చాల విమానాలు పెర్లు హార్బరులో అమెరికా నష్టపోయింది. మరికొన్ని నౌకలు చెడినవి జపాను విమానాలు ఎక్కువగను, నాల్గు సబుమెరైనులును, పెయానలుల వద్ద నొక జపాను యుద్ధనౌక (విమానాలు మోసేది) యముంచబడినవి.

జపాను విమానాలు సింగపూరుపై దాడి సలిపి, రెండు క్రూసరు నౌకలను ముంచినవి. కాని అచట సివిలు ప్రజలే చనిపోయిరిగాని నౌకాశ్రయమున కెట్టి నష్టం కలుగలేదు.

ఉత్తరమందు జపాను సేనలు దిగకుండా వారించు కార్యమునందు బ్రిటిషువారి యుద్ధ నౌకలగు ప్రిన్సు ఆఫ్ వేల్సు, రిపల్సు జపాను విమానాలచే ముంచబడినవి.

జపాను సేనలు బ్రిటిషువారిదగు మలయ ద్వీపకల్పం పైకి దాడివచ్చినవి. రైల్వే కేంద్రమగు కోటాబారు పట్టుకొనజూచిరి. కాని రాయలు విమానాలు వారి సైన్యపు మోటారులను చెదరగొట్టెను. అవి వెనుకకు పోయినవి. దిగిన సైన్యాలను బ్రిటిషు సామ్రాజ్య సేనలు వశపరచుకున్నవి. ఇంకను దక్షిణాన్న యుద్ధం జరుగుచున్నది.

సయాం గల్ఫు రేవులో బ్రిటిషు సరిహద్దునకు 50 మైళ్లు ఉత్తరంగానున్న పట్టానియందు జపాను సేనలు దిగినవి. జపాను నౌకలు తాయిలాండు ముఖ్యపట్నమగు బాంగుకాంగుపై ఫిరంగులు ప్రేల్చినవి. 5½ గంటలు దాడి నెదిరించినపిదప తాయిలాండు ప్రజలు పోరుమాని, జపాను సేనలు తమ దేశంమీదుగ పోవుటకు అంగీకరించిరి.

తాయిలాండు శత్రుసేనకు యారీతిగ తావిచ్చినది కనుక, యిపుడు మలయా-బర్మాల రక్షణయందు మనశ్రద్ధ ఎక్కువగును. మలయా తీరము విశాలమగు యిసుక దిబ్బలతోను, మర్రి వృక్షాలవంటి వృక్షాలతోను నీటి బురదగనుండి జపాను సేనలు సులభంగాపోవ వీలుండదు. తాయిలాండు నుండి మలయాకు ఉత్తరమున పేలమార్గాలు మూడే గలవు. అవి సన్నని మార్గాలు; భారతీయసేనలు ఆస్ట్రేలియాసేనలచే ఆ మార్గాలు కాపాడబడుచున్నవి. ఇతర మార్గాలు అడవుల మధ్యనున్న కాలిబాటలు కావున సింగపూరునకుగాని మలయాకుగాని వాటిద్వారా ప్రమాదముండదు. మలయా యొక్కయు (బర్మాయొక్కయు) విమానదళం నౌకాదళములను నాయకుడగు మార్షలు సర్ రాబర్టు బ్రూకు పాపెము గారు చాలా బాగా తయారుచేసిరి గావున అచట జపాను సేనలు ఎక్కువ విజయం పొందలేవని ఘట్టిగ చెప్పవచ్చును.

---

# ఇండియానుండి 37,000 వస్తువుల సప్లయి.

## తూర్పు దేశాల సభవారికి ఆరు నెలలలో చేరిన సరకు.

1941 వ సం॥ ఏప్రిల్ నుండి సెప్టెంబరు మాసంవరకు ఆరు నెలలలో ఇండియానుండి తూర్పుదేశాల సప్లయి కౌన్సిలువారికి అనేక లక్షల గజముల వస్త్రములు సప్లయి చేయబడెను. 7,000,0 0 గోనె సంచులుగూడ ఇండియా నుండి కోరబడెను. వీటిని ఇసుకతోనింపి పెద్ద భవనముల ముందర రక్షణకు నిలువచేసి యుంచుదురు.

బ్రిటిషు సామ్రాజ్యమునకు చెందిన తూర్పుదేశాలన్నింటి ప్రతినిధులు ఒక సభగానేర్పడి యుద్ధావసరములకు ఏ దేశమునుండి ఏ సరకు తెప్పించవచ్చునో నిర్ణయించి ఆర్డరు లిస్తున్నారు. ఆ ఆర్డరుల ప్రకారం 50,000 లకు పైగా వివిధ రకముల సరకులు యుద్ధావసరములకు కావలసియున్నది. అందులో 35,500 లకు పైగా ఇండియా సరఫరా చేయుచున్నది. ఇండియాయొక్క అవసరమేకాక, యితర దేశాల అవసరం కొంతవరకుగూడ యిందువలన తీరుచున్నది. మిగిలిన సరకులనుగూడ ఇండియాలో తయారుచేయుటకు వీలున్నదేమోనని పరిశోధనలు జరుపుచున్నారు. వందలకొలది క్రొత్త వస్తువులు తయారుచేయుటకు అవకాశమున్నట్లు తెలియుచున్నది.

ఈ వివిధదేశాల సంఘంలో నున్న భారతీయ ప్రతినిధి తనదేశంలో జరుగుచున్న ఉత్పత్తి విధానమునందలి మార్పులు, అభివృద్ధి క్రొత్త పరిశోధనల ఫలితములను సంఘమునకు తెల్పుచుండును. దానివలన మధ్యధరాసముద్ర ప్రాంతములందు పసిఫిక్ ప్రాంతములందున్న సైన్యాలకు కావలసిన సరకున్ను సంఘంలోచేరిన వివిధ తూర్పుదేశాల రక్షణ కార్యములకు అవసరమగు సరకులన్నియును వలయునంత వరకు పూర్తిగ ఇండియాలోనే తయారుచేయించుటకు వీలేర్పడును.

నూలు వస్త్రములు, నీరుపడితే తడియని వాటరు ప్రూఫ్ వస్త్రములు, కోరా కాలికో తువాళ్లు మున్నగునవేకాక్ష ఖాకీ రంగు రుమాళ్లు, కోరిబీసు కాకీ రిల్లగుడ్డ, నూలు చెడ్డీలు, నీలం సెర్జిగుడ్డ, పెద్ద కోటులకు లైనింగు బట్ట, తేలిక డ్రిల్లు వస్త్రములు, దోమతెరలు మున్నగు వివిధరకముల వస్త్రములు తయారుచేయబడుచున్నవి. సైన్యానికి కావలసిన పట్టలు, వెస్టు కోట్లు, కాలర్లు, పెద్దకోట్లు, షర్టులు, మేజోళ్లు, చేతిగవ్వులు, పంట్లాములు, పారాయిల్లు, నిక్కర్లు, కుడ్తాలు, టోపీలు, కంబళ్లు మొదలగునవి ఎన్నో ఇండియాలో తయారుచేయబడుచున్నవి.

వస్త్రములేకాక ఇంజనీరింగు సరకుగూడ ఎక్కువగ కోరబడుచున్నవి. ఎలెక్ట్రికు మోటార్లు, టేబిలు ఫానులు, ఉక్కు త్రాళ్లు, నీరు నిలువయుంచుకొను టాంకులు, రైలు

పెట్టెలు, చేతిపనిముట్లు, పంపులు, మంటలార్పు సాధనములు, వాల్టుమీటరులు, ఇన్సులేటరులు, ఉక్కు ఖడ్గములు, కుట్టుపని మిషీనులుకూడ కోరబడెను.

మ్యాపులు వేయుటకు కాగితము, రూళ్లకర్రలు, కవరపేపరులు మున్నగునవికూడ ఇండియానుండి కోరుచున్నారు.

ఔషధములు, శస్త్రచికిత్స సాధనములు, వైద్యానికవసరమగు 292 వస్తువులు విదేశాలనుండి దిగుమతిచేయుట మాని ఇండియాలోనే తయారుచేయుచున్నారు. ఇండియా సరకునే ఎక్కువగ తూర్పుదేశాల సభవారు కోరుతున్నారు. నల్లమందులోనుండి తయారగు వస్తువులకు శానిటరీ సామానులు, రసాయనములు, ఉష్ణ-ప్రత్తిగాజు, ఆస్పత్రి స్లిప్పర్లు మున్నగు ఆస్పత్రి సామానులు ఎన్నింటికో ఆర్డరులు ఇచ్చిరి.

చేతి తొడుగులు, బూట్సు, పిక్కలకు తొడుగులు మున్నగు ఎన్నో తోలు సరకులుగూడ కోరబడుచున్నవి.

టేకు, సాళ, దేవదారు దూలములు, కంబములు, వెదుళ్లు, స్లీపరులు, పీపాలు, కర్రడబ్బులు, టేబిలు సొరుగులు మున్నగునవికూడ ఇండియాలో తయారుచేయబడుచున్నవి.

ఇండియానుండి కోరబడుచున్న యితర చిల్లర సామానులకు లెక్కలేదు. అందులో ముఖ్యమయినవి కత్తులు, చాకులు, ఫోర్కులు, విషవాయు నిర్మూలన కవచాలు, కాన్వాసు స్క్రీనులు, కోట్లు, బక్కెట్లు, మరుపులు, కుర్చీలు, చాపలు, జనుమునార వస్తువులు, జండాలు, పిన్నులు, జోడుతాళ్లు, కార్డైటు, చలవచేసే మందులు, రుచిపోగొట్టే మాత్రలు, బ్రషులు, శిరోకవచాలు, ఇస్త్రీయంత్రాలు మున్నగునవికూడా ఇండియానుండి తెప్పించుకొనుచున్నారు

---

సలహా: ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.

[మదరాసు సమాచారముల ఆఫీసరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS: PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.